## శాస్త్రి గారి ఇతర రచనలు



**ముద్రితములు :**

1. శ్రీరామకథా2_మృతము-సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే Ph.D. పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)
9. మాటలంటే మాటలా?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయశతకము

**అముద్రితములు :**

1. అధ్యాత్మయోగము

హరిః ఓమ్

# శ్రీ సత్యనారాయణశతకము



రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

**డాక్టర్. తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి**

M.A., Ph.D.,



శ్రీ రామ చంద్ర పరబ్రహ్మణేనమః

## కోదండ రామాలయము

నేతాజీ నగర్-నిడుబ్రోలు

మన రామాలయము నేతాజీ నగరు (నిడుబ్రోలు) నందు శ్రీ స్వస్తిశ్రీ ప్రభవ నామ సంవత్సరము ఫాల్గుణ శుద్ధ ఏకాదశి భానువారమున శంఖుస్థాపన చేయఁబడి స్వస్తిశ్రీ శుక్లనామ సం॥ మాఘ శుద్ధ సప్తమీ శుక్రవారం శ్రీకోదండరామస్వామి, సీతా లక్ష్మణ హనుమత్ పరివార సమేతుఁడై విగ్రహమూర్తులుగ విరాజిల్లుచు (ప్రతిష్ఠింపబడి) భక్తులకు కొంగు బంగారమై జనాభీష్ట ప్రదాయుఁడై వెల్లులు ప్రసరింపుచున్నాడు.

శ్రీ స్వామి వారి సన్నిధిలో ప్రతి నిత్యము ఆధ్యాత్మిక కార్యక్రమములు శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రపారాయణ సంఘము, నేతాజీనగరు వారిచే జరుపబడుచున్నవి. వసంతోత్సవములు, గణపతి ఉత్సవములు, పారాయణోత్సవములు, కార్తీక, ధనుర్మాసోత్సవములు జరుపబడుచున్నవి. ఇట్టి ఆధ్యాత్మిక కార్యక్రమములలో నెల్లఱుఁబాల్గొని భక్తి పుష్పములు సమర్పించి శ్రీవారి కరుణకు పాత్రులు కాఁగోరుచున్నాము.

ఇట్లు
ఆలయ కమిటీ మఱియు
శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రపారాయణ సంఘం.

హరిః ఓమ్

# శ్రీ సత్యనారాయణ శతకము



లోకస్వామివి నీవు, నీమహిమ సుశ్లోక్యంబు, భక్తాళికిన్
నీ కారుణ్యము రక్ష, నిన్గొలుచుటే నిత్యంబు కర్తవ్య, మో
పాకారిప్రముఖామరప్రణుత తత్త్వా! సత్యధర్మ ప్రియా!
నీకున్ గూర్తుఁ గవిత్వ మాత్మకిడు శాంతిన్, సత్యనారాయణా!


రచయిత

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్. తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి

M.A., Ph.D.,

హక్కులు : రచయితవి

ప్రథమ ముద్రణ : 2000 - నవంబరు 11
కార్తీక పూర్ణిమ

ప్రతులు : 1000

వెల : రూ.10-00

**శివశ్రీ ప్రచురణలు**

గాణాపత్యము మున్నుగాఁగల మతాబ్ధుల్ నామ రూపాదులన్
గౌణంబౌ; సకలంబుఁ దా నగుచు వెల్గంజేయు ప్రాణంబు, తత్
ప్రాణంబే ప్రణవంబు, తత్ప్రణవమే భావింప దైవంబు, స
ప్రాణంబౌ ప్రణవంబు నీవెకద; దేవా ! సత్యనారాయణా !

"కలకాలంబుఁ గటాక్ష వీక్షణములన్ గాపాడు మమ్మంచు" నిన్
గొలువన్ గోర్కెలుదీర్చి, యాపదల ద్రెుక్కుల్‌గొంచు, దీవించుచున్
గలిదోషంబు హరించి, సజ్జనులకున్ గల్యాణ సంపత్సమృ
ద్ధు లొసంగన్ బిరుదైన స్వామి ! నినుఁ గొల్తున్, సత్యనారాయణా !

ప్రాప్తి స్థానము : **టి.యన్.పద్మావతి**
భావనారాయణ పేట,
పొన్నూరు - 522 124.
గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.
☎ (08643) 43566.

డి.టి.పి. : రాజా గ్రాఫిక్స్, సామ్రాట్ కాంప్లెక్స్, పొన్నూరు.

ముద్రణ : సృజన ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గార్లపాటి కోటేశ్వరరావు కాంప్లెక్స్,
పొన్నూరు.



# స్మృత్యంజలి









ముద్రాపయితలు

**శ్రీ కోట సుబ్బారావు గారి మాతృమూర్తి**

**శ్రీమతి శేషారత్నం**







గురుదేవులు

శ్రీ యెలిశెట్టి రాధాకృష్ణారావు గారు

### శ్రీ గురుభ్యో నమః

బ్రహ్మజ్ఞాన సంపన్నులు, బహుముఖ ప్రజ్ఞాశాలులు, ఉన్నత విద్యావేత్తలు అయిన శ్రీ యెలిశెట్టి రాధాకృష్ణారావుగారు బాపట్ల డిగ్రీ కళాశాల తెలుగు శాఖలో పనిచేసి ఎందఱో విద్యార్థులకు తమ విజ్ఞానామృతమును ప్రేమతో పంచి పెట్టి, వారి ఉత్తీర్ణతకు దోహదపడుచు, ఉజ్జ్వల భవిష్యత్తుకు ఉత్తమమైన బాటలు వేశారు. అది వారి ఉద్యోగధర్మంకాఁగా, ఆత్మధర్మాన్ని అనుసరించి, వారు గొప్పఉపాసకులై పరమేశ్వరానుగ్రహంతో అతీంద్రియమైనశక్తులు సాధించి, తమను అనుసరించి, ఆశ్రయించినవారికి మేలు కలిగే విధంగా ఎన్నో విషయాలలో సహకరించారు. వారి ఔన్నత్యాన్ని, ఔదార్యాన్ని తెలుసుకొన్న వారెంద ఱెందఱో వారి శిష్యులుగాచేరి, వారి బోధనలు వింటూ, వారి సూచనలు పాటిస్తూ, వారి అభిప్రాయాన్ని గ్రహించి భక్తి భావాన్ని, సంఘ సేవా దృష్టిని ఏర్పరచుకొని సమాజంలో ఉత్తమ వ్యక్తులుగా గుర్తింపు పొందుతున్నారు.

**గుర్తు చెప్పేవాడే గురువు** - ఆత్మజ్ఞానాన్ని, దైవస్వరూపాన్ని నిరూపించి ముక్తికి మార్గాన్ని సూచించేవాడని దాని భావము. గురు శబ్దములోని'గు' కారానికి మానవులలోని అజ్ఞానమనే చీకటిఅని, 'రు' కారానికి దానిని పోగొట్టగల సమర్థుఁడుని అర్థంచెప్పి పెద్దలు గురుపదమును వివరించారు. ఆ విధమైన గురు శబ్దానికి వీరు సరియైన ఉదాహరణగా లోకంలో ప్రసిద్ధికెక్కారు. శ్రీ రాధాకృష్ణారావుగారు బ్రహ్మశ్రీ గొలగమూడి వెంకయ్య స్వామి వారి యెడ భక్తి తాత్పర్యములు కలిగి వారిని గురుభావంతో గౌరవించేవారు.

శ్రీ రాధాకృష్ణారావుగారిది గంభీరమైన ఆకృతి. సౌమ్యమైన ప్రకృతి - శత్రువులకు కూడా హాని తలపెట్టక పోవటం వారి ఉత్తమ వ్యక్తిత్వానికి నిదర్శనం, వారు శిష్యులకు ఎప్పడు కోపం తగ్గించుకోమని, ఎదుటివారు తెలియక కోపంతో మాట్లాడినా, పట్టించుకోవద్దని ఉపదేశించేవారు. వారి ఉత్తమ బోధనలు విన్న వారి శిష్యులు తమ క్రోధభావాలను, క్రూరకృత్యాలను, విడిచిపెట్టి మర్యాదాపూర్వకమైన జీవన ప్రవృత్తిని అలవర్చుకొని, సాటివారితో స్నేహ సంబంధాలను పెంపొందించుకొని, సంఘంలో గౌరవాదరములను సంపాదించుకొంటున్నారు. దైవజ్ఞులైన శ్రీ రాధాకృష్ణారావుగారికి సమకాలికులుగా పుట్టి, వారితో పరిచయమేర్పడి, వారితో కలిసి జీవించడం, ప్రయాణించడం, వారితో మాట్లాడటం, వారుచెప్పే మాటలువినటం, ఆచరించగలగటం శిష్యులు వారు చేసుకొన్న పూర్వపుణ్యఫలంగా భావిస్తారు. దివ్యానుభవం కలిగించే గురుదేవులైన వారి సమక్షంలో ఉన్నప్పడు లోకమే తెలియదు. కాలమే గుర్తుకు రాదు. వారి దృష్టిపడినంతలో శిష్యులకు ఏవిధమైన బాధలు కలుగవు. ఇవి వారి శిష్యుల విశ్వాసముతో కూడిన అనుభవ విశేషములై నిత్యం స్మరింపబడుతున్నాయి.

గురుదేవులు శ్రీ రాధాకృష్ణారావు గారి శ్రీమతి రేణుకాదేవిగారు. ఈ పవిత్ర దంపతు లిరువురు. శిష్యవాత్సల్యము కలిగి, నమ్మిన వారిశిష్యుల పాలిటి పార్వతీపరమేశ్వరులుగా కీర్తింపబడ్డారు. వీరు తమిళనాడులోని వశుమలై గ్రామములో శ్రీ సుబ్రహ్మణ్యస్వామి అంశగా ప్రసిద్ధులైన శ్రీలలితానంద సరస్వతీ స్వామి వారి శిష్యులై, దేవీ ఉపాసనాపరులై ఆ భగవతి అనుగ్రహాన్ని సంపాదించి, స్వార్థమును విడిచి, లోకోపకారపరులై జీవనము గడుపుచు, ఉన్నవారు, లేనివారు అనే తేడా లేకుండా శిష్యులందఱిని సమదృష్టితో చూస్తూ ఆత్మీయత, అనురాగాలతో వ్యవహరించేవారు.

గురువు గారు శిష్యుల కోరిక మేఱకు వారి నివాస గృహములు, భవనములు, వ్యాపారసంస్థలు, ఫ్యాక్టరీలు, మిల్లులు, ఆలయముల యొక్క వాస్తు పరిశీలించి, మంచి చెడులు వివరిస్తూ, భవిష్యత్తులో జరుగబోవు శుభాశుభములను తెలియజేస్తూ, శిష్యుల అభివృద్ధికి తోడుపడేవారు, లోకంలో అందఱివలె, వారు శాస్త్రమును స్థూల దృష్టితో గాక, సూక్ష్మ దృష్టితో పరిశీలించి యధార్థమును గ్రహించి చెప్పేవారు. అందువల్ల శిష్యులకెంతో మేలు జరిగేది. గురు దేవులు ధ్యానంలో కూర్చొని ఉండగా, భూత భవిష్యత్, వర్తమానములన్నియు వారి దివ్యదృష్టికి గోచరమయ్యేవి. వా రా పరిజ్ఞానంతో శిష్యులెందఱికో ఇళ్లు కట్టించి పెట్టారు.వారి ఇండ్లలో పిల్లలకు పెళ్లిళ్లు చేయించారు వారంతా ఇప్పుడు పిల్లా పాపలతో, ధన ధాన్యములతో, సుఖంగా ఉన్నారు. వీరి శిష్యులలో కొందఱు ఆధ్యాత్మిక సాధనలో మహోన్నత స్థానాన్ని సాధించి మిక్కిలి ప్రసిద్ధులైన వారు కూడా ఉన్నారు.

గురుదేవులు శ్రీరాధాకృష్ణారావుగారు నిరంతరము పుణ్యతీర్థములను పవిత్రక్షేత్రములను సందర్శిస్తూ తమవెంట వచ్చిన శిష్యులకు ఆయా ప్రదేశములలోగల విశేషములను వివరిస్తూ, దైవశక్తితో బాటు జాతీయ భావాన్ని, దేశ భక్తిని, పెంపొందించే యాత్రల ప్రాశస్త్యాన్ని తెలియజేసే వారు. ఎక్కడకు పోయినా వారికి ప్రముఖ స్థానం లభించేది. వారిని చూచిన వారందఱూ ఎంతో భక్తి భావంతో నమస్కరించి, గౌరవించేవారు. కార్యసాధనలో సహకరించేవారు. వారు పట్టింది బంగారం, ముట్టింది ముత్యమై ప్రకాశించింది.

వారు, నిగర్విగా, నిరాడంబర జీవిగా, పరిణత ప్రజ్ఞులై ప్రవర్తిస్తూ, బాధా పరితప్తమానసులైన వారికి పున్నమి వెన్నెలలా చల్లదనాన్ని హాయిని ప్రసాదించారు. ఉద్యోగ విరమణ తర్వాత కృష్ణా జిల్లా కైకలూరు శివారు ప్రాంతంలో గల అయోధ్యా పట్టణమునందు గల తోటల మధ్యలో గృహవసతి కల్పించుకొని, ఆ ప్రశాంత వాతావరణంలో సమస్త లోకములు సుఖముతో

వారి తపః ప్రభావం వలన సహజ వైర ప్రవృత్తి గల జీవులు సహితం ఆసన్నిధిలో శాంత స్వభావంతో, స్నేహప్రవృత్తి కలిగి ప్రవర్తించేవని వారి శిష్యులు చెప్పగా వింటున్నాము. తపస్సు చేత పవిత్రమైనందున వారు పలికినమాట నడిచిన బాట సమాజానికి ఆదర్శమై నిలిచాయి.పూర్వము ఒక భక్తుడు తనదైవాన్ని వర మడుగుచు, ఓ పరమేశ్వరా! దైన్యములేని జీవనము, ఆయాసములేని మరణము, దేహాంతమున నీ సాయుజ్యము ఇమ్మని కోరినాడట. గురుదేవుల జీవిత మా వరవడిలో గడచినది.వారు దీ.8-7-2000 న తమ భౌతిక శరీరాన్ని చాలించి అఖండ సచ్చిదానంద స్వరూపంలో చేరినప్పటికి, వారు ముందుగా ప్రకటించిన ప్రకారము తమపై భక్తి భావం కలిగిన శిష్యులకు అవసరాన్ని గుర్తించి ఎప్పటికప్పుడు సూచనలు అందిస్తూ వారి కోరికలు తీరుస్తూ, కష్ట సమయంలో అండదండగా నిలుస్తూ, తమ చైతన్య భావంతో, తేజ స్వరూపంతో ఆదుకొంటున్నారు. అభ్యుదయ పరంపరకలిగేలా ఆశీస్సు లందిస్తున్నారు. దీ.20-7-2000 న ఈనాడు గుంటూరు జిల్లా ఎడిషన్‌లో శిష్యులు వారికి స్మృత్యంజలి ఘటిస్తూ, వారి ఔదార్యాన్ని ఘనంగా వివరించారు.

## ధన్యవాదములు

మాన్యమిత్రులు శ్రీ నాగలక్ష్మి రైస్ మిల్లు, నిడుబ్రోలు, మే॥పా॥ శ్రీ కోట సుబ్బారావు, శ్రీమతి హేమలత దంపతుల ఆర్థిక ప్రోత్సాహముతో ఈశతకము ప్రకటింపబడి, వారికి గల గురు భక్తితో బ్రహ్మణ్యులు శ్రీ యెలిసెట్టి రాధాకృష్ణారావు గారిని గూర్చి ఇక్కడ పరిచయం చేయటం జరిగింది. ఆపుణ్య దంపతులు, గురుదేవుల సూచన మేరకు శ్రీ వీరాంజనేయ స్వామి గుడిలో అభిషేకం చేయించి, అన్నదానం జరిపించి, బ్రహ్మశ్రీ కోట జగన్నాధ స్వామి ఆశ్రమ సన్నిధిలో ఉండగా మా శ్రేయోభిలాషులైన శ్రీ చేబ్రోలు సత్యనారాయణ గారు ఈ శతకముద్రణను గూర్చి ప్రస్తావించటం, వారు సంతోషంతో అంగీకరించటం జరిగింది. ఆ విధంగా ఈకృతి ఆకృతి తాల్చింది. ఇందులకు వారందఱికి నా ధన్యవాదములు సమర్పిస్తున్నాను. వారిని, వారి సంతానమైన నాగలక్ష్మి, శివరామకృష్ణ, వంశీకృష్ణలను శ్రీసత్యనారాయణస్వామి ఆయురారోగ్య భోగభాగ్యములనిచ్చి కాపాడుగాక అని ప్రార్థించుచున్నాను.

చిన్న నాడెన్నడో విద్యార్థి దశయందు వ్రాసియుంచిన ఈ పద్యములను పరిశీలించి, పరిష్కరించిన బ్ర.వే.కాశీభట్ల సత్యనారాయణగారికి, చదివి ముద్రణకు ప్రోత్సహించిన మా కళాశాల ప్రిన్సిపాల్ శ్రీమాన్ వేదాంతం విజయసారథి గారికి,మిత్రులు శ్రీమల్లా ప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి, శ్రీనిష్ఠల సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి, ప్రూఫులు దిద్ది సహకరించిన, శ్రీజొన్నల గడ్డ జానకి రామయ్య గారికి నా ధన్యవాదములు తెలియజేస్తున్నాను.

**డాక్టర్. తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి**

## శ్రీ సత్యనారాయణ స్వామి వ్రత కథా విశేషములు

శాశ్వతము, అనంతము అయిన సత్యమే జ్ఞానము, బ్రహ్మము. పరమోత్కృష్టమైన ఆ సత్యము యొక్క శాసనము వలననే వాయువు వీస్తోంది. సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సమస్తమైన ప్రకృతి నడుస్తోంది. సత్యమే మాటకు ప్రాణమై నిలుస్తోంది. లోకమున అన్నింటికి సత్యమే ఆధారము. కావున సత్యము సర్వశ్రేష్ఠము. సకల ధర్మములకు మూలము. విశ్వమునకు శ్రేయోదాయకము. అట్టి మహత్తర-అద్భుత, సత్య శక్తి సంపన్నుడైన దేవుడు, శ్రీ సత్యనారాయణుడు. అతడు త్రిగుణాతీతుడైన శుద్ధ సత్త్వ స్వరూపుడు. తెల్లని శరీరము కలవాడు. సత్యలోకవాసియై మనసుకు, మాటకు అందని ఆతేజో మూర్తియే లోక సంరక్షణమునకై జగద్వ్యాపకమైన విష్ణురూపమునుదాల్చి, దుష్టశిక్షణార్థము ధర్మసంస్థాపనార్థము అయా అవతారములెత్తి, వివిధనామములతో వ్యవహరింపబడుచు, శంఖము, చక్రము, ఖడ్గము, గధ, ధనుస్సు, మొ॥ ఆయుధములు ధరించి వనమాలా విభూషితుడై, యోగి హృదయ ధ్యానగమ్యుడై నీల మేఘశ్యాముడై, లక్ష్మీకాంతుడై, నారాయణ శబ్దవాచ్యుడై విరాజిల్లుచున్నాడు. ఆ మహోత్ముడు లోకానుగ్రహ బుద్ధి యగు నారదునకు ఉపదేశించిన సత్యనారాయణ వ్రత కథా విశేషము లిచట వివరింపబడుచున్నవి.

ఒకానొకప్పుడు నైమిశారణ్యమున శౌనకాది ఋషులు సత్రయాగమును జేయుచు, నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుడైన సూతుని జూచి, నమస్కరించి ఏ వ్రతము చేసిన, ఎట్టి తప మాచరించిన, కోరిన ఫలములు సిద్ధించునో తెలుపుమని కోరిరి. ఈ విషయమే నారదు డడుగగా పూర్వము శ్రీమహావిష్ణువు చెప్పిన సంగతి, మీ కిప్పడు వివరింతునని అతడు ఇట్లు చెప్పదొడగెను.

పూర్వము నారదుడొకప్పడు వివిధ లోకములందు సంచరించుచు మానవ లోకమునకు వచ్చి, జన్మపరంపర వలన ఇచటి ప్రజలు అనుభవించుచున్న శారీరక, మానసిక బాధలను జూచి, మనసు కరిగి, వారికి సహాయము చేయు సంకల్పముతో వైకుంఠమునకుబోయి, విష్ణుమూర్తిని సమీపించి, భక్తితో నమస్కరించి, నాయందు దయతో ఈమానవజాతిని ఉద్ధరించు నుపాయమును జెప్పమని ప్రార్థించెను. ఆవిష్ణుమూర్తి నారదు డడిగిన దానికి సమాధానముగా, నాయనా ! నీవులోకములకు మేలుకోరి అడిగిన ఈ ప్రశ్న నాకెంతయో సంతోషమును కలిగించుచున్నది. స్వర్గ, మర్త్య లోకములందు దుర్లభమైనదియు, మోహములను బోగొట్టి ఇహ, పర సుఖములను గూర్చునట్టిదియు నగు, సత్యనారాయణ స్వామి వ్రతమొకటి కలదు. నీయందు గల వాత్సల్యముతో ఇప్పడు నేనావ్రతమును గూర్చి చెప్పచున్నాను అని పలికెను. అది విన్ననారదుడు ఓ భగవంతుడా !

1) ఆ వ్రతము చేసిన కలుగు ఫలమేమి ? 2) చేయు విధానమేది ?
3) ఆ వ్రతమెప్పడు చేయవలెను? 4) పూర్వము ఆ వ్రతమునెవరు చేసిరి ? ఆదియంతయు వివరింపుమని వేడెను. శ్రీ మహా విష్ణువు ఇట్లు చెప్పెను.

**వ్రత ఫలము :** ఆ వ్రతము దుఃఖ శోకములను పోగొట్టి, సర్వ సంపదలను కలుగ జేయును. సంతానమును ప్రసాదించును. సర్వత్ర జయము నిచ్చును.

### వ్రతము చేయు సమయము-విధానము

వైశాఖ, కార్తీక, మాఘ మాసములందును, లేక ఏదైనా ఒక శుభదినమునందును ఈ వ్రతము నాచరింప వచ్చును. మఱియు వివాదములు(యుద్ధము) కలిగినప్పడు, కష్టములు సంభవించినప్పడు, దరిద్రముచే బాధపడుచున్నప్పడు, ప్రత్యేక ఫలమును(వరము) ఆశించియు, వివాహ, గృహారంభాది విశేష సందర్భములందును ఈ వ్రతము చేయవచ్చును. ఏకాదశి, పూర్ణిమ, తిథులందు, రవి సంక్రమణ సమయము లందు ఈ వ్రతము చేయుట మంచిది. ఎప్పడైనను వ్రతము చేయదలచిన దినమున ఉదయముననే నిద్రలేచి, కాలకృత్యములను తీర్చుకొని, సంధ్యావందనాది నిత్య విధులను పూర్తి చేసుకొని, ఇతర వ్యాపకములను విడిచి, నిర్మలమైన మనస్సుతో, నిశ్చలమైన భక్తితో స్వామీ ! నీయనుగ్రహము కొఱకై ఈనాడు వ్రతము చేయుచున్నానని సత్యనారాయణునికి విన్నవించుకొని, మధ్యాహ్న సమయమున చేయవలసిన కర్మానుష్ఠానములు నిర్వర్తించి, సాయంకాలము తిరిగి స్నానము చేసి, రాత్రి ప్రారంభమున శుభ్రముగా అలికి, ముగ్గులు పెట్టిన పూజా స్థలమున పీఠము పెట్టి, దానిని నూతన వస్త్రమును పఱచి, బియ్యము పోసి మధ్య భాగమున కలశమునుంచి వస్త్రముతో అలంకరించి, ప్రత్యేకముగ వరుణ దేవుని అర్చింప వలెను. సత్యనారాయణస్వామి ప్రతిమను పంచామృతములతో అభిషేకము చేసి, పూజామంటపమునపెట్టి, విఘ్నేశ్వరుని, లక్ష్మీనారాయణులను, పార్వతీ పరమేశ్వరులను, నవగ్రహములను, ఇంద్రుడు మొదలుగాగల అష్టదిక్పాలకులను సపరివారముగ నావాహనము జేసి అందఱిని షోడశోపచారములతో పూజింపవలయును. ఈ వ్రతము నదీ తీరమునగాని, దేవాలయమునగాని చేయుట ఉత్తమము.

ఈ వ్రతమును అన్నివర్ణముల వారును, అన్ని కులముల వారును ఆచరింపవచ్చును. స్త్రీలు, పురుషులు(దంపతులు), పిన్నలు, పెద్దలు ఎవరికి అవకాశము కలిగినప్పడు వారు చేసుకొనవచ్చును. వేదమంత్రములతో, పౌరాణిక మంత్రములతో ఎవరికి సాధ్యమైన విధమున వారు వ్రతము నాచరింపవలయును. అవసరమును బట్టి ఏదినముననైనను ఈ వ్రతము చేయవచ్చును. వ్రతసమయమున బ్రాహ్మణులను, బంధువులను పిలుచుకొని, అరటిపండ్లు, కొబ్బరికాయలు, ఆవునేయి, ఆవుపాలు, పూలు సంపాదించుకొని పూజగావించి, గోధుమ రవ్వ, పంచదార సమానముగ(శేరుంపావు-1 1/4చా॥) చేర్చి, ప్రసాదమును సిద్ధముచేసి, స్వామికి నివేదన చేయవలయును. వ్రతము పూర్తియైన పిమ్మట బ్రాహ్మణులకు యథాశక్తి దక్షిణలిచ్చి, కథను శ్రద్ధగా విని ప్రసాదమును భక్తితో స్వీకరించి, బంధుమిత్రులతో గూడి భోజనము చేసి, ఆరాతియంతయు భగవంతుని ప్రీతికొఱకు నృత్యగీతాదికములతో స్వామిని

సేవించుచు, ఇంటికి చేరవలయును. ఇది భూలోకమున విశేషించి, కలియుగమునందు కోరిన కోరికలను పొందుటకు మిక్కిలి సులభమైన మార్గము. ఈ వ్రతము లోభమును విడిచి, యథాశక్తి ఆచరించుట ఉత్తమము. ఇట్టి క్రతువ్రతముల వలన వితరణగుణములవడి పుణ్యశీలమేర్పడును.(పూర్వమీ వ్రతము చేసి ఫలితమును పొందిన వారిని గూర్చి చెప్పటవలన విన్నవారికి, భక్తి విశ్వాసములు కలుగును. వ్రతప్రభావము నిరూపితమగును. కావున నారదుఁ డడిగినదానికి సమాధానముగా విష్ణుమూర్తి ఆకథలిట్లు చెప్పుచున్నాడు.

పూర్వము కాశీ పట్టణమున నొక ఉత్తమ బ్రాహ్మణుడు దారిద్ర్యదుఃఖమున బాధపడుచు, నిత్యము భిక్షకై తిరుగుచుండుటఁజూచి కరుణాంతరంగుడైన భగవంతుఁడు ఆతనికి వృద్ధ బ్రాహ్మణ రూపమున దర్శనమిచ్చి వ్రతము నుపదేశించి, చేయు విధానమును వివరించెను. అతడట్లు చేయుటకు సంకల్పించుకొనినంత మాత్రముననే వ్రతమాచరించుటకు తగినంత ధనము ఆనాటి భిక్షాటనమున లభించినది. అందుకు సంతోషించి, శ్రద్ధతోనతడు బంధుమిత్రులతోఁగూడి వ్రతమాచరించుట వలన సకల దుఃఖములు తొలగిపోయి, సకల సంపదలును కలిగినవి. అప్పటి నుండియు ఆ విప్రుడు ప్రతి మాసమునందును సత్యనారాయణ వ్రతము నాచరించి సర్వపాపములనుండి విముక్తుఁడై సర్వ సుఖముల ననుభవించి తుదకు, స్వామి అనుగ్రహమున దుర్లభమైన మోక్షమును పొందెను. ఈ వ్రతమాచరించిన వారు ఆ బ్రాహ్మణునివలె దుఃఖ విముక్తులై సుఖింపగలరు. అని నారాయణుఁడు నారదునకు చెప్పెనని, సూతుడు శౌనకాదులకు వివరించెను. అది విన్నశౌనకాదులు ఓ మహాత్మా! ఆ బ్రాహ్మణుని వలన తెలుసుకొని, ఎవరెవ్వరీ వ్రతము చేసినారో వివరింపుమని సూతమహర్షిని అడిగిరి. ఆఋషి ఇట్లు చెప్పెను.

ఒకప్పుడు ఆ బ్రాహ్మణుఁడు బంధువులతో, స్వజనులతోఁగూడి యథా శక్తిగా, ఈ వ్రతము చేయుచున్న సమయమున కట్టెలమ్ముకొని జీవించు శ్రామికుఁ డొకఁడు దాహము(త్రాగునీరు) కొఱకు కట్టెలమోపు వీథిలో నుంచి, విప్రుని యింటిలోనికి వచ్చి అతడు చేయు వ్రతమునుఁజూచి, నమస్కరించి, ఆవ్రతమును గూర్చి వివరముగా అడిగి తెలుసుకొని శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతము ఆచరించిన వారికి కోరికలు సిద్ధించును, సకలైశ్వర్యములు కలుగు నని విని సంతోషముతో, దాహము తీర్చుకొని, ప్రసాదమును తీసుకొని, భోజనము చేసి, ఇంటికి వెడలెను. మరునాడు కట్టెలమోపు నెత్తినపెట్టుకొని వీధిని అమ్మగా వచ్చిన ధనముతో శ్రీసత్యనారాయణ స్వామి వ్రతము చేయుదునని సంకల్పించుకొని పట్టణమునకు పోయి కట్టెలు అమ్మగా స్వామి అనుగ్రహమున నా దినమున రెట్టింపు ధనము లభించినది. అందుల కతడు మిక్కిలి ఆనందించి అరటి పండ్లు, చక్కెర, నేయి, పాలు గోధుమ రవ్వ మొదలగు పూజా సామాగ్రి కొని, యింటికి చేరి, బంధుమిత్రులను బిలిచి, విధి, విధానముగా వ్రతమాచరించి, ఆవ్రత ప్రభావము వలన ఇహలోకమున ధనమును సుఖమును, సంతతిని, సంతోషమును పొంది తుదకు సత్యపురమునకు చేరెను. మఱియు పూర్వము ఒకప్పుడు సత్యవాదియు, జితేంద్రియుడును అయిన ఉల్కాముఖుఁడను రాజు, అనుకూలవతియైన భార్యతో గూడి భద్రశీలానదీతీరమున శ్రీసత్యనారాయణస్వామి వ్రతము నాచరించుచుండగా అపారధనముతో వ్యాపారమునకై నదీ మార్గమున ఓడలోఁ బ్రయాణించు సాధువొకడు ఆ సందర్భమునుఁజూచి, నావను, తీరమున నిలిపి రాజును సమీపించి, భక్తి శ్రద్ధలతో నీవు చేయుచున్న ఈ వ్రతమేమియని కుతూహలముతో ప్రశ్నించెను. మిక్కిలి ప్రభావముగల సత్యనారాయణ వ్రతము పుత్రసంతానము కొఱకై చేయుచున్నానని రాజు సమాధానము చెప్పెను. అది విన్న సాధువు నాకును సంతతిలేదు. బిడ్డలు కలిగినచో నేనును ఈ వ్రతమాచరింతునని ప్రతిజ్ఞ చేసి, వ్యాపారము పూర్తి చేసుకొని, ఆనందముతోనింటికి చేరి, సంతతినిచ్చు నా వ్రతము సంగతి భార్య లీలావతికి చెప్పి మన కోరిక నెఱవేరినచో వ్రతము చేయుదునని పలికెను. భార్య సంతోషించెను. భగవదనుగ్రహమున అచిరకాలముననే వారికి ఒక కుమార్తె కలిగెను. శుక్ల పక్షమున చంద్రునివలె దినదిన ప్రవర్ధమానయగు ఆ కుమార్తెకు వారు కళావతియను నామకరణము చేసి, ప్రేమతో పెంచుకొను చుండిరి. అప్పుడు లీలావతి మధుర వచనములతో భర్తను స్వామివ్రతమాచరింపుడని కోరుచు, కర్తవ్యమును గుర్తు చేసెను. లోభగుణముగల సాధువు అదియనవసరమగు ధనవ్యయముగా భావించి ఏకముగా కుమార్తె వివాహ సమయమున ఆ వ్రతము చేయుదమని భార్యను సమాధాన పఱచి, వ్యాపార వ్యవహారములలో మునిగిపోయెను. కాలచక్రము గిర్రున తిరిగి, ఆలోచించి, చూచునంతలో కళావతికి పెండ్లి ఈడు వచ్చినది. కుమార్తెకు తగిన వరుని వెదుకుటకై సాధువు దూతలను నియమించెను. వారు పోయి, కాంచన నగరమున సుందరుడు, గుణవంతుడు అయిన యొక వణిక్ పుత్రుని జూచి, మంచి సంబంధమని యోచించి అతనిని తెచ్చిరి. సాధువు అన్నివిధముల యోగ్యుడైన ఆబాలునికి తన కన్యనిచ్చి వివాహము చేసెను. సాధువు దురదృష్టవశమున ఆ పెండ్లి సందడిలో వ్రతము చేయుట మఱచి, స్వామికి కోపము తెప్పించెను.

ఆ తరువాత, వ్యాపార నిపుణుడైన సాధువు, అల్లునితోగూడి సముద్ర తీరమునగల రత్నసానుపురమునకేగి, వ్యాపారము నిర్వహించుచుండెను. రమ్యమైన ఆ పట్టణమునకు చంద్రకేతువు రాజు. అంతలో స్వామి, తన మాట తప్పిన ఆ షావుకారునుఁజూచి, అతనికి దారుణము, కఠినము అయిన దుఃఖము కలుగునని శపించెను. ఇంతలో రాజగృహమున ఆ దినము దొంగలు ప్రవేశించి, ధనమపహరించిరి. రక్షక భటులువెంబడింప, వారు ఆ ధనమును వర్తకులవద్దవిడిచి, తప్పించుకొని పారిపోయిరి. భటులచటికి చేరి, రాజధనమునుఁజూచి, వారేదొంగలనిభావించి, బంధించి, రాజుకడకు గొని పోయిరి. దొంగలము కాము అని తామెంతగా విన్నవించుకొనినను, రాజువినక,

విచారింపక, వారికి కఠిన కారాగార శిక్ష విధించెను. వారి ధనమంతయు రాజు స్వాధీనము చేసుకొని, కోశాగారమునజేర్చెను. సత్యదేవుని శాపవశమున అప్పైశ్యుని యింటిలో దొంగలుపడి ధనాదికమును దోచుకొనిపోయిరి. అతని భార్యాబిడ్డలు అనేక కష్టముల పాలై, ఆధి, వ్యాధులతో బాధపడుచు, ఆకలి దప్పికలతో పీడింపబడుచు, అన్నమునకై యింటింటికి తిరుగుచుండిరి. 'దైవ కృతమున కసాధ్యము లేదను పెద్దల మాటకిదియే నిదర్శనము. ఒకనాడు కళావతి ఆకలితో అన్నమునకై ఒక బ్రాహ్మణుని యింటికేగి, అచట జరుగుచున్న స్వామి వ్రతమును జూచి మ్రొక్కి కథవిని ప్రసాదమును స్వీకరించి, భోజనము చేసి రాత్రి పొద్దుపోయి, యింటకి చేరెను. అప్పడాతల్లి కుమార్తెను' ఇంతరాత్రివఱకెక్కడ నుంటి' వని ప్రశ్నించెను. కళావతి బ్రాహ్మణునియింట కోరిన కోరికలు దీర్చు శ్రీసత్యనారాయణవ్రతము జరుగుచుండుట జూచి, కథ విని, ప్రసాదమును భుజించి, వచ్చితినని పలికెను. అదివిని లీలావతి సంతోషించి, దైవాపరాధమున తమకు జరిగిన యనర్థమును గుర్తించి, ఇదియంతయు భగవంతుని మాయావిశేషమని గ్రహించి, బంధుమిత్రులను గూర్చుకొని చేతనైనంతలో భక్తితో వ్రతమాచరించి, "స్వామి! మమ్ము మన్నించి, భర్తయు, అల్లుడును క్షేమముగా నిల్లుజేరునట్లు దయతో ననుగ్రహింపుము" ని ప్రార్థించెను. అందుకు సంతుష్టుడైన స్వామి ఆ రాత్రి చంద్రకేతు మహారాజునకు స్వప్నమున దర్శనమిచ్చి, అకారణముగ బంధింపబడి, నీ కారాగారమున మ్రగ్గుచున్న వణిగ్వరులను విడిపించి, వారి సొమ్ము వారికిమ్ము, లేనిచో నీవు సర్వనాశనమయ్యెదవని చెప్పి అంతర్ధానమయ్యెను.

మఱునాడుదయము రాజు, మంత్రి పురోహితాదులతో సభజేసి రాత్రి తనకు వచ్చిన కల వారందఱికి వివరించి, వారి సలహాతో ఆ వ్యాపారులను బంధవిముక్తులనుజేసి, సభకు పిలిపించెను. "రాజు నాడు విచారింపకయే శిక్ష విధించెను. నేడు నేర విచారణ చేసి, తమకెంతటి శిక్ష విధించునో "యని వారు భయముతో వణుకుచుండిరి. అప్పడా రాజు వారితో "మీకు దైవ ప్రాతికూల్యముచే నిట్టి దుఃఖము సంభవించినది. ఇంక మీకెట్టి భయమును లేదు. మిమ్ములను నిర్దోషులుగా గుర్తించి విడిచి పెట్టుచున్నాను"ని చెప్పి వారికి క్షుర కర్మ చేయించి , నూతన వస్త్రముల నిచ్చి ఆదరించి, వారి వద్ద స్వాధీనము చేసుకొన్నదానికి రెట్టింపు ధనమిచ్చి సంతోషపెట్టి గౌరవముగా సాగనంపెను. ఆనందముతో ఇంటికి ప్రయాణమైపోవుచుండ, స్వామి వారిని పరీక్షించుటకై సన్యాసివేషమును ధరించివచ్చి "ఓ వ్యాపారులారా ! మీ నావ యందేమేమి సామానులున్నవి? అని ప్రశ్నించెను. ధనగర్వముతో వారు అతనిని పరిహాసమాడుచు" ఓ సన్యాసీ ! మా పడవలో ఏమున్న నీకెందులకు? అపహరించుటకు నీవు ఆలోచించు చుంటివాఏమి? ప్రస్తుతము నావలో ఆకులు, తీగెలు మాత్రమే ఉన్నవని సమాధానము చెప్పిరి. అదివిని అతడట్లేయగుగాకయని పలికి, కొంత దూరముపోయి ఒక చెట్టు క్రింద కూర్చొనియుండెను.

ఇంతలో నావ నీటిపై తేలుచుండుటచే లోనికితొంగిచూచి, ధనము మూటలుంచినచోట ఆకులు, తీగెలు ఉండుటచే ఆవేదనచెందుచు సాధువుమూర్ఛిల్లి కొంతసేపటికి లేచి, ఏడ్చుచుండెను. అప్పడతని అల్లుడు మామను జూచి" ఇప్పడేడ్చుట వలన ప్రయోజనమేమియు లేదు. ఆ సన్యాసి శపించుటచే, నిట్టిదురవస్థ సిద్ధించినది. అతడే మనలను రక్షింపగల సమర్థుడు. మనమాతని ప్రార్థించిన ధనము తిరిగి లభించు" నని చెప్పెను. అప్పడు వారతని సమీపమునకేగి, వినయమున నమస్కరించి, "మా అపరాధమును మన్నింపు" మని అనేక విధముల వేడుకొనిరి. ఆ సన్యాసి "నీవు నా వ్రతము చేయుదునని ప్రతిజ్ఞ చేసి, మాటతప్పి, చేయనందువలన నీకు ఇట్టి కష్టములు సంభవించె"నని పలికెను. ఆ మాటలు విని సాధువు అతనిని భగవంతునిగా తెలుసుకొని ఈవిధముగా స్తుతించెను.

"మహాత్మా ! బ్రహ్మాది దేవతలే, నీ మాయచే మోహితులై లోకములకు ఆద్యుడవు, ఆరాధ్యుడవు అయిన నిన్ను యథార్థముగ తెలియలేకున్నారు. నామ గుణ, రూపములకు అతీతుడవైన నిన్ను గుర్తించుటకు అజ్ఞుడనైన నేనెంతవాడను. నా యథాశక్తి నిన్ను ఆరాధింతును. నా ధనాదులను తిరిగి నాకు ప్రసాదింపుము. జగద్రక్షకుడవైన ఓ పుండరీకాక్షా ! నిన్ను శరణువేడుచున్నాను". ఇట్లు భక్తితోచేసిన ఆ ప్రార్థన విని, సంతుష్టుడైన జనార్దనుడు వానికి వాంఛితార్థములిచ్చి, యచ్చటనే అదృశ్యుడయ్యెను. అంతనా సాధువు అల్లునితో గూడి, నావలోనికి పోయి, తమ ధనమంతయు యథాస్థానమున నుండుట జూచి, సంతసించి, దైవము కరుణించెనని విశ్వసించి, స్వజనులతోగూడి సంతోషముతో వ్రతమాచరించుటకు సంకల్పించి, ప్రయాణమై, కొంతదూరము పయనించి రత్నపురము సమీపించినందున, ముందుగా తమరాక తెలియజేయుచు విశ్వాసపాత్రుడైన దూత నొక్కని యింటికి పంపెను . అతడేగి, ఆశుభవర్తమానమును లీలావతికి జెప్పెను. ఆమె సంతోషముతో శ్రీసత్యనారాయణుని పూజించి, తక్కిన వ్రతము పూర్తి చేసి రమ్మని కుమార్తెకు చెప్పి, పతిని చూచుతొందరలో తాను ముందుగా రేవు కడకేగెను. కుమార్తెయు, వ్రతసమాప్తిగావించి, ప్రసాదమును తినకుండ , భర్తను చూచుటకై నదీతీరమునకు వెడలెను. ప్రసాదమును మఱచి వచ్చినందునకు కోపించిన, ఆ స్వామి మహిమచే, అల్లునితో కూడిన నావ ఆ నదీతీరముననే తిరోధానము చెందెను(కనబడలేదు). నావ మునిగిపోయినదని వారందఱు భావించిరి. పూర్వమెన్నడు ఈ ఒడ్డున నావ మునిగిన సంగతి వినలేదని, తాము చూడలేదని అచటివారెల్లఱు ఆశ్చర్యమందిరి. భర్త కనబడనందుకు దుః ఖించుచు, కళావతి తాను సహగమనము చేయుటకు సిద్ధపడెను . కుమార్తె దైన్యమునుచూచి, లీలావతి ఆమెను కౌగిలించుకొని రోదించుచుండెను. ఇది అంతయును చూచిన సాధువు" సత్యదేవుని లీలలు మిక్కిలి ఆశ్చర్యకరములు.

వినబడునట్లు బిగ్గఱగా చెప్పి, భూమిపైబడి శ్రీసత్యనారాయణునకు దండ ప్రణామము లాచరించెను.

దీనావనుడైన భగవంతుడు అతని ప్రార్థనమాలకించి సంతుష్టుడై "నీ కుమార్తె వ్రతమాచరించి, ప్రసాదమును స్వీకరింపక విడచి వచ్చినందులకే ఈ కష్టము కలిగినది. ఆమె శీఘ్రమే యింటికిపోయి, ప్రసాదమునును భుజించి వచ్చినచో, కళావతి భర్తను పొందగలద"ని ఆకాశవాణి రూపమున తెలియజేసెను. కళావతి భగవంతుని ఆదేశము ననుసరించి ఆ విధముగా చేసి, భర్తనుగాంచి, సౌభాగ్యవతియై సంతోషించెను. సాధువు అనదీతీరముననే బంధు, మిత్రులతో గూడి వ్రతమాచరించి, ధనముతో, బంధుగణముతో గృహమునకు చేరెను. అప్పటి నుండి జీవితాంతము ఆ సాధువు, పౌర్ణమియందును, రవిసంక్రమణమునందును సత్యనారాయణుని పూజించుచు, ఇహలోక సుఖముల ననుభవించి, దేహాంతమున సత్యపురమునుచేరెను.

మహర్షులారా ! మఱియు నొక కథ వినుడు. పూర్వము తుంగధ్వజుడను రాజు ప్రజలను సుఖముగా పరిపాలించుచుండెను. అతడు ఒకనాడు అడవి కేగి, పెక్కుమృగములను వేటాడి , అలసిపోయి, విశ్రాంతికై ఒక చెట్టుక్రింద కూర్చుండెను. ఆ సమీపమున గోపాలురు కొందఱు భక్తితో సత్యనారాయణస్వామి వ్రతము నాచరించి, రాజునకు ప్రసాదము తెచ్చి యిచ్చిరి. అభిజాత్యముచే గర్వితుడైన ఆరాజు వారిచ్చిన ప్రసాదమును త్యజించి, పురమునకుపోయెను. అంత సత్యదేవుని ప్రభావమున నాతడు సర్వమును కోల్పోయి పశ్చాత్తప్తుడై తిరిగివచ్చి, ఆగోపాలురతోగూడి, వ్రతమాచరించి భక్తితో ప్రసాదమును, భుజించి, ధనపుత్రాదులను, రాజ్యమునుపొంది, ఇహసుఖముల ననుభవించి, తుదకు స్వామి యనుగ్రహమున సత్యపురమును చేరెను.

పరమదుర్లభమైన ఈ వ్రతము చేసినను, ఈ పుణ్య కథ విన్నను భుక్తి, ముక్తులు కలుగును. ధన ధాన్యాదికములు వృద్ధిచెందును. దరిద్రుడు ధనమును పొందును. బంధితుడు ముక్తుడగును. భీతునకు భయము తొలగును. ధైర్యము కలుగును. విశేషించి కలియుగమున సత్యపూజనము సులభముగా ఫలించును. కావున ఓ మునులారా ! వ్రతము చేయవలసిన అవసరమును, వ్రతవిధానమును, ఆ వ్రతము యొక్క మాహాత్మ్యమును, చేయుటవలన కలుగు ఫలితమును వివరించితిని. ఆస్వామినే, కొందఱు సత్యేశుడనియు, సత్యనారాయణుడనియు, సత్యదేవుడనియు, వ్యవహరింతురు. సనాతనుడైన ఆశ్రీమహావిష్ణువు కలియుగమున అనేక అవతారములెత్తి ఏరూపమునకొలిచినను, ఏనామమున పిలిచినను భేదములేక భక్తులందఱినీ, కాపాడుచు, వారికోర్కెలు తీర్చుచుండును. ఈ కథ విన్నవారికి, వ్రతము చూచినవారికి పాపములు నశించి, సత్యదేవుని ప్రసాదము లభించును" అని సూతుడు చెప్పెను. ఐదు అధ్యాయములతో గూడిన, ఈ కథ స్కాంద పురాణమున రేవాఖండమునందు చెప్పబడినది. సర్వము సమాప్తము.

# శ్రీ సత్యనారాయణశతకము
## అన్నవరక్షేత్రవిశేషములు

శ్రీరమ్యుండు రఘూద్వహుండు, సతమున్ క్షేత్రంబు రక్షింప, లో
కారాధ్యుండవు నీవు, సత్యవతి వామాంకంబునన్, భక్తమం
దారుండీశ్వరుఁడర్థి దక్షిణదిశన్ భాసింపఁ, గొల్వుండి నా
వా రత్నాద్రిని, భక్తపాలనము సేయన్, సత్యనారాయణా! 1

పంపాతీర్థ జలంబులన్ మునిఁగి, సద్భక్తుల్, భవద్వైభవం
బింపారన్ గనులార నారయఁ గరం బిష్టార్థముల్ గూర్చి, పా
లింపన్ జాలెడు వాఁడవీవని, భవల్లీలా కథల్ మోదమున్
బెంపన్, ద్వారముఁజేరిరయ్య! కనరావే, సత్యనారాయణా! 2

ధరనెల్లప్పుడు శిష్టరక్షణముఁబ్రాధాన్యంబుగాఁబూని,సు
స్థిరతన్ బాలనఁజేసి, ధర్మముఁబ్రతిష్ఠింపన్, బ్రతాపంబునన్
బరతేజః ప్రకరంబు నొంపఁ దరలింపన్ వీర నామంబుఁ దా
ల్చి, రమాకాంతుఁడవైన నిన్గొలిచెదన్ శ్రీసత్యనారాయణా! 3

ఖలులై, చంచలులై, బలప్రమదులై, గర్వాంధులై రాక్షసుల్
చెలరేఁగన్ జగముద్ధరింపఁ బరులన్ శిక్షింప నుగ్రాకృతిన్
గలవెన్నో యవతారముల్ గతమునన్, గల్యాణసంపత్తి,భ
క్తులఁబ్రోవన్ బ్రభవించితీవె, నినుగొల్తున్, సత్యనారాయణా! 4

నియతిన్, వేయివ్రతంబు,లొక్కతతినేనిన్, జేయఁగాఁజాలు, నా
లయమందున్, వ్రతచిత్రముల్ నలుదిశల్ వ్యాపింప, నిర్మించి, రెం
తయు వైశాల్యముఁగల్గు మండపములన్, దద్వైభవం బెప్ప, డా
రయమెందున్ భువనావనప్రవణ! ధీరా! సత్యనారాయణా! 5

ఫలభాయంత్ర మహత్త్వమౌర! తలఁపన్, భానూదయంబైన వే
ళల సూచించుఁ గ్రమంబునన్ బగటికాలం బెప్ప, డెన్నెన్ని గం
టలో లెక్కించుఁ, బరాత్పరుండెటుల, నంతర్బుద్ధి వెల్గించు, న
ట్లలరున్, శాస్త్ర, మమోఘ, మద్భుతమునయ్యా! సత్యనారాయణా! 6

స్తుతమై, శాశ్వతమై, ప్రపంచమయమై శుద్ధంబు, బుద్ధంబునై
వెతలందీర్చెడి దైవమై పొలుచు, నీ విశ్వాత్మ భావమ్ము,నా
మతి కూహింపఁగ శక్యమౌనొకొ? మహామాయాప్రభావంబునన్;
నతులన్ సన్నుతులన్ భజింతు వినుమన్నా! సత్యనారాయణా! 7

## వ్రతమాహాత్మ్యము

ఇతరాపేక్షలుమాని, నిర్మలమనోవృత్తిం, బవిత్రంబు,నీ
వ్రతమున్ విన్నను, జేసినన్, దలఁచినన్, భక్తాళికిన్ వాంఛిత
ప్రతతుల్ దీఱు, ననంతదివ్య భువన స్వారాజ్య సంసిద్ధియౌఁ,
బతగాధీశతురంగ! నీలఘనరూపా! సత్యనారాయణా! 8

చిరకాలమ్ము వ్రతమ్ము సల్పుచు, మనస్శీమం బ్రతిష్ఠించి, నీ
చరణాబ్జంబుల నర్చసేసెడు తపస్సంపన్నులన్ గన్న, నే
దురితంబుల్ దురవస్థలున్ గలుగ, వర్ధుల్ పూర్ణ సంతృప్తులౌ
దురు, సంసారుల దుఃఖముల్ దొలఁగు సాధూ! సత్యనారాయణా! 9

నీ నామంబు వచించినన్, దలఁచినన్, నీరూపు భావించినన్
ధ్యానింపన్, వ్రతమాచరింపఁ,గనులల్లన్సన్, గథల్విన్న, స
మ్మానంబొప్పఁబ్రసాదమున్ దినినఁ గామ్యంబుల్ ఫలించున్ శుభం
బానందంబు ఘటిల్లు, సజ్జనశరణ్యా! సత్యనారాయణా! 10

నానారూపములన్ ధరించి, ధరలోనన్, బెక్కు క్షేత్రంబులం
దానందంబు ఘటింప, భక్తుల కనేకాభీష్ట సంపాదివై
జ్ఞాన జ్ఞేయములందభేదమగు, నిన్ సర్వాత్మ నేరీతిఁదా
ధ్యానించున్ దదుపాస్యుగా నగుదువయ్యా! సత్యనారాయణా! 11

సదయుండై భువనాళి నారదుఁడు సంచారంబుఁగావించుచున్
దుది, భూలోకముఁజేరి, వారల మహద్దుఃఖంబు వీక్షించి, యా
పదఁదప్పించు నుపాయ మెద్ది? యని నిన్ప్రార్థింపఁగా, సర్వసం
పదలన్గూర్చెడు నీవ్రతంబొసఁగి తప్పా! సత్యనారాయణా! 12

చాతుర్వర్ణ్యమువార లీ వ్రత మవశ్యం, బాచరింపం దగున్
శ్రౌతస్మార్తవిధిన్ ద్విజుల్, తదితరుల్ స్త్రైణంబుఁ బౌరాణికం
బౌ, తంత్రంబున సేయ, నందఱకు నయ్యై వాంఛితార్థంబులన్
జేతోమోద మెలర్పఁగూర్చును బ్రశస్తిన్, సత్యనారాయణా! 13

కృతపాపౌఘవిధిన్ దరిద్రుఁడయి క్షుత్తృ *డ్పీడ దుఃఖించుచున్
బ్రతినిత్యంబుఁ బరిభ్రమించు ద్విజునిన్ రక్షించు వ్యాజంబునన్
వ్రతమున్, జేయు విధానమున్ దెలుపవే,వాఁ డట్లె సేయం,గృపా
మతి, సంపన్నివహంబులీయవె, మహాత్మా! సత్యనారాయణా! 14

ఎరమోత్సాహముతో వ్రతంబు నొనరింపన్ భద్రశీలాతటిన్
గురువృద్ధ ప్రముఖాప్త బంధుజనముల్ గూడంగ, సద్భక్తి, భూ
ధరుఁడుల్కాముఖుఁడర్చనల్ సలిపినన్, ధర్మాత్ము నవ్వాని, కా
దరపూర్వంబుగ నీప్సితంబొసఁగి, తాద్యా! సత్యనారాయణా! 15

"నాకున్ సంతతి కల్గినన్ వ్రతవిధానంబాచరింతున్" శ్రితా
నేకాభీష్టవరప్రసాదనచణా! నిక్కంబుగా" నన్న ,వై
శ్యాకల్పున్,దదభీష్టదాన పరిపుష్టానందుఁగావించి, దే
వా! కాపాడితి, వీ జగంబు నుతియింపన్, సత్యనారాయణా! 16

వ్రతమున్ జేయక కాలమున్ గడుపుచున్ వ్యాపారదృష్టిన్ గృత
ఘ్నత వర్తించిన,షావుకారు,నెలమిన్ గష్టాల పాల్జేసి, స
మ్మతితో నాతిని భార్యచేయు వినతిన్ మన్నించి, కాపాడి,యా
తత సంపత్సముపేతుఁ జేయవె? మహాత్మా సత్యనారాయణా! 17

సిరికిం గ్రొవ్వి, నినున్ దృణించి పొరపొచ్చంబాడ నాపత్పరం
పర పాల్జేసితి,వంతలోఁదెలిసి తద్వైశ్యుం డవశ్యంబు,నీ
చరణంబుల్,శరణంబువేఁడిన, నభీష్టప్రాప్తిఁగావించి తీ
వరయున్, దాసునితప్పు దండమునఁబోదా?సత్యనారాయణా! 18

---

* క్షుత్తృడ్పీడ = ఆకలి దప్పికలతో బాధపడుచు

పతి రాకన్ విని, మోదమున్ గని, వ్రతప్రారంభమున్‌జేసి, త
త్సుత,నాపూజ ముగించి రమ్మనుచుఁదా సూచించెఁ దద్వైశ్య ప
త్ని, తదానందమునన్ బ్రసాదముఁదినన్లేకున్నఁ దద్భర్తృ నా
వ, తిరోధానముఁజెందె నీమహిమ; దేవా!సత్యనారాయణా! 19

గగనంబందు ధ్వనించె సత్యమగు వాక్యంబొండు,"వైశ్యుండ!శీ
ఘ్ర గతిన్ నీసుత నాప్రసాదమును దాఁ గైకొన్నదద్భర్తగా
నఁగ వచ్చున్ నిజ"మంచు; నామెయు,ననంతప్రాభవున్ నిన్భజిం
పఁగ, సౌభాగ్యమునన్ పతింగనె; మహాత్మా! సత్యనారాయణా! 20

గోపాలుర్వ్రతమాచరించి, మది నీకున్ మ్రొక్కి, సద్భక్తితో,
భూపాలుంగని, నీ ప్రసాదమిడినన్ మూర్ఖస్వభావంబుతో
నా పాపాత్ముఁడు దానివీడి, చని, సర్వార్థంబుఁగోల్పోయి,ని
న్నాపద్బాంధవు భక్తిఁగొల్చి మనఁడొక్కో?సత్యనారాయణా! 21

ధనికుల్ పేదలు'ఁజిన్నపెద్దలను, భేదంబేది లేదీవ్రతం
బొనరింపన్, స్థిరభక్తిఁగొల్వఁగ నితాంతోత్సాహులౌ వారికిన్,
ధనధాన్యంబులు, శాంతిసంతతులు, విద్యావైభవంబుల్, బలం
బును, సౌఖ్యంబు, జయంబుఁగల్గు సతతంబున్, సత్యనారాయణా! 22

దయయున్, ధర్మము,దాన,మార్తజనసంత్రాణంబు, సత్యంబు,ని
శ్చయమౌ జ్ఞానము, పుణ్యసంపదయు, సత్సాంగత్య,మెన్నం,జితేం
ద్రియులై పొంది, సుఖింతురేయెడ,భవద్దివ్యాంఘ్రిసేవారతిన్
జయ,ముత్సాహముఁగల్గుభక్తులు; మహేశా!సత్యానారాయణా! 23

కలఁడొక్కండె పరాత్పరుం,డతఁడు తక్కన్ వేఱు లేరెవ్వరున్,
జలమాకాశమునుండి భూమిఁబడి, తా,సర్వంబు, సంద్రంబుఁజే
రు లలిన్, మూర్తులనేకమైన, నలరారున్‌దేజమొక్కండునై
యిల నేరీతి నమస్కరించినను నీకే; సత్యనారాయణా! 24

భువిపైఁజీరమువెట్టి, వస్త్ర మెలమిన్ భూషించి, బియ్యంబు నిం
పి, విశిష్టంబుగ నష్టదిక్పతుల నావేశింపఁగాఁజేసి, గౌ
రవ భావంబున, నా,నవగ్రహములన్‌రావించి, బ్రహ్మన్ యజిం
చి, వరాభీష్టములిచ్చు,నిన్నుఁగొలుతున్‌శ్రీసత్యనారాయణా! 25

## కవి-సాహిత్యము

రసవత్కావ్య మొనర్పఁబూని, కవి, ప్రారంభంబునన్ నీదు పా
ద సరోజమ్ములు,సావధానమతియై ధ్యానింప, విజ్ఞాన దీ
ప్తి, సమాజమ్మున నిల్పు, భూరిగుణముల్ బెంపొందఁభాషించు, దు
ర్వ్యసనంబుల్ దొలగంగఁజేయు, శుభమొప్పన్ సత్యనారాయణా! 26

కవితామర్మమెఱింగి, కావ్యముఁజమత్కారప్రధానంబుగాఁ
గవితల్ విశ్వజనీనమై వెలయు సంస్కారంబులన్ బ్రోదిఁజే
సి, విశిష్టంబగు ధర్మమార్గమున వాసిన్, జాతికిన్ నీతి, రీ
తి, వివేకంబును జూపినన్ శుభము కాదే, సత్యనారాయణా! 27

అవినీతిన్ దునుమాడి, రీతిఁదెలుపన్, వ్యామోహమున్ బాపి,వా
స్తవమున్ జూప, శుభాస్పదంబయిన గాథల్ సెప్పి, సద్వృత్తి నే
ర్పి, వివేకంబుఁబ్రతిష్ఠసేయఁగలవారేలేరు, యోజించినన్‌ఁ
గవియొక్కండె సమర్థుఁడీ జగతి నౌఁగా, సత్యనారాయణా! 28

## లోక వృత్తము

సారాచార విచార దూరుఁడగుచున్ సంసారి, కంసారి! దు
ర్వారప్రాకృతబుద్ధి, లోకవిషయ వ్యాపారలోలత్వ, మే
పారన్, ఘోర భవాబ్ధిఁ గ్రుమ్మరు నవిశ్వాసమ్మున్, గ్రన్ననన్
బారంబెయ్యుడు నేర, ఁడేవిధియు, దేవా! సత్యనారాయణా! 29

ఆరాటం బది యేటి,కేటికి వృథా ప్రారంభ సరంభ, మీ
భారంబేటికి, మాటి కీకుటిల భావంబేటి, కీపాటి సం
సారంబేటికి, నిన్ స్మరింపఁగల సంస్కారంబు లేకున్న, నె
వ్వారైనన్ దరియించిరే? భవము; దేవా! సత్యనారాయణా! 30

కామ క్రోధ మదాదులన్, గల వివేకంబెల్లఁగోల్పోయి, యా
రామక్షేత్ర, కళత్ర, పుత్ర, పశు,మిత్రవ్రాతమే, శాశ్వతం
బై, మోదంబు ఘటిల్లఁజేయునను, పేరాసం బ్రవర్తింతు, రె
ట్లీ మాయన్ దరలింపఁజేసెదవొ,స్వామీ! సత్యనారాయణా! 31

గజరాజుల్, భుజగాధినాథులు, విహంగవ్రాతముల్,భానుఁడున్
రజనీవల్లభుఁడున్, గ్రహపతి, నిజప్రారంభులై, కుందగాఁ
బ్రజ లీక్షించియు, దైవమారయక, గర్వస్ఫూర్తి వర్తించుచున్
నిజప్రాగల్భ్యముగాఁ,దలంచెదరు భ్రాంతిన్, సత్యనారాయణా! 32

మణులున్ మాన్యములేల? నీదు పద పద్మంబుల్ భజింపన్, జితై
షణులై, పొందరె ముక్తిసంపద, నవశ్యం, బీ రహస్యం, బమ
ర్షణులై, యారయ లేరు పామరులు, ధర్మంబున్ బ్రబోధించి, ర
క్షణ సేయందగు, దుష్టశిక్షణవిధీషా! సత్యనారాయణా! 33

కామక్రోధములెంతవారికినలంఘ్యంబౌర!"సర్వంబు మే
మే"మాదే, యఖిలార్థసంపదయు,"మమ్మేరేనిఁగాదన్న నీ
భూమిన్, నిల్వఁగనేర్తురే" యను నహంబున్‌గల్గు మూర్ఖాళికిన్,
క్షేమం బెవ్విధినుండు, నిక్కమరయన్, శ్రీసత్యనారాయణా! 34

ఖల సంసర్గముఁజేసి, సద్వినయ సంస్కారంబు లేమిన్, దురూ
హలపాలై విహరించి, మాన మద గర్వారంభ సంరంభ సం
చలదాత్మవ్యసనోగ్రదాహ దహనజ్వాలానలిన్ గూలియున్,
దలపోయం డొక కొంత, నిన్ను వలపంతన్, సత్యనారాయణా! 35

చదువంజాలిన మాత్రఁద్వన్మహిమమున్ జర్చించి, తత్త్వంబు ని
ట్టిది యౌనంచు, వచింపఁగల్గుదురె,? పాండిత్యంబునన్ గర్వితుల్;
సదయాపాంగ! మదంతరంగమున నిచ్చల్ గూర్మి వర్తించి, నీ
పదపద్మంబులు గొల్చు భాగ్యమిడు, దేవా! సత్యనారాయణా! 36

ఏయేవేళల, నేరికే వయసునం, దేరీతి, నెచ్చోట, నే
యే యర్థంబులు, సంఘటింపఁగఁ దలం, తీ, వా క్రమంబొప్పఁగా
నాయావేళల, వారి కా వయసునం, దారీతి, నచ్చోట, నా
యా, యర్థంబు, లవశ్యమున్ గలుగునయ్యా! సత్యనారాయణా! 37

సకలప్రాణి సమూహముల్ సతతమున్ సౌఖ్యాబ్ధి నోలాడు కో
రిక నత్యంతము దుష్టమార్గముల వర్తింపన్ బ్రయత్నించు;ఁబూ
నిక నీసర్వము నిర్వహించు ఘనునిన్, నిన్గొల్వ,నిత్యంబు, వా
రికిఁబ్రాప్తింపవె? శాంతిసౌఖ్యతతులున్ శ్రీసత్యనారాయణా! 38

కలుముల్ లేములు, సౌఖ్యదుఃఖములుఁగల్గన్ బుణ్యపాపంబులే,
తలఁపన్ గారణ, మట్టికర్మచయమున్ దప్పింప శక్యంబె? బొ
మ్మలు గావించి, విభిన్నవర్ణములు, ధర్మంబుల్, స్వభావమ్ములి
మ్ములఁగల్పించి, వినోదముల్ గనెదవేమో? సత్యనారాయణా! 39

మానప్రాణములన్ హరించుచు, నసన్మార్గానువృత్తంబులౌ
నానాజాతి విరోధముల్ సమసి, సానందంబుగా, నంద టీ
ష్టానీకంబుల, నందుచున్, మహితవిజ్ఞానప్రదీపంబులై
మానింపందగు, జీవనప్రగతినిమ్మా! సత్యనారాయణా! 40

కఱకుంగుండెల,క్రూరకృత్యముల, లోకంబాఱడింబెట్ట నా
మొఱలాలింపవొ, భక్తులన్ మనుపవో, మూర్ఖాళి దండింపవో,
చిఱునవ్వుల్ వెదచల్లవో, సుజనసంక్షేమంబుఁ, బాటింపవో
చెఱలంద్రుంచి,ప్రశాంతినెక్కొలుపవో, శ్రీసత్యనారాయణా! 41

దేహాత్మభ్రమతోఁబ్రమాదపడి, యుద్రేకంబులంబొంది, దు
ర్మోహాంధస్థితి ధర్మమున్ గనరు, సంబుద్ధాత్మ! యవ్వారి ద
ర్పాహంకారములన్ హరించి,పరతత్త్వంబున్ బ్రసాదించి, సం
దేహంబుల్ దొలఁగించి, జ్ఞానమిడు క్షాంతిన్, సత్యనారాయణా! 42

తనకుం, దా వలయంబు లల్లుకొని, తన్మధ్యంబు నందుండి, లూ
త, నితాంతోన్మదవృత్తి " లోకమిదె, యేతన్మాత్రమేచాలు, నా"
కను భావంబున సంచరించుగతి, నిత్యం బుర్వి వర్తించుచున్
గనలేరెందును ధర్మమీ నరులు ప్రాజ్ఞా! సత్యనారాయణా! 43

బహుజన్మార్జితమైన కర్మఫలముల్, బంధంబులై, దేహి, దు
స్సహ తాపత్రయదుఃఖముల్ గనుచు, నిచ్చల్, చచ్చి, జన్మించుచున్
స్పృహణీయంబగు బ్రహ్మమున్, దలఁపఁడర్థిన్, భోగభాగ్యాదులన్
బ్రహతంబైన మనంబుతో, మహితరూపా! సత్యనారాయణా! 44

తొలిజన్మంబునఁజేయు పుణ్యఫలమేదోగాని, త్వద్భావనా
బలసంపత్తి లభించె, స్వామి! యితరవ్యాపారముల్ మాని, ని
ర్మల చిత్తంబున నిన్భజించెదఁ గృతార్థత్వంబు సామర్థ్య, ము
జ్జ్వల కీర్తిన్ గలిగింపవే కృపను; దేవా! సత్యనారాయణా! 45

సకలారంభములన్, నిరంతరము, మత్స్వాంతంబునం, దర్థ సి
ద్ధికిఁబ్రార్థింతు, సమర్థుఁడీవనెడు బుద్ధిన్, భక్తమందార! తా
వక మూర్తిత్రయరూప, మీ భువనముల్ పాలింప ఁజాలింప, ఁబూ
నికఁగావింపనగున్ నుతింపఁదరమా? నిన్, సత్యనారాయణా! 46

రవిచంద్రానలకాంతి సంతతులునేరంబోవు నిన్నోల, మా
ధవ! త్వద్రూప మహత్వ తత్త్వమెదలో ధ్యానింప, భక్తాళి, కా
ర్తి వినాశంబగు, నవ్యయంబగు సుఖశ్రీపాళి వర్ధిల్లు, నీ
భువనామోదముఁగూర్చుఁ దావకపదంబుల్, సత్యనారాయణా! 47

భయవిభ్రాంతి నడంచు, సత్ఫలిత మింపారన్ బ్రసాదించు, సం
శయపాశం బెడలించు, మించిశుభముల్ సంధించు, సద్వృత్తిఁగూ
ర్చి యశంబుల్ ఘటియించు, నీపదము లీసృష్టిం, ద్రిలోకైక నా
థ! యథాశక్తి భజించు భక్తుల, కనంతా! సత్యనారాయణా! 48

★ కావించు : సృష్టించు

శ్రీరమ్యంబగు నీపదాబ్జయుగళిన్ సేవించు భక్తాళి, కా
ధారంబై, సకలార్థ సంపదలఁజేతఃప్రీతిఁగల్పించి, సం
సార క్లేశములన్ దెరల్చి, పరమౌజశ్శ్రీఁబ్రసాదింతు, వో
సారోదార! సమాశ్రితార్తజనపోషా! సత్యనారాయణా! 49

ధ్యానింతున్ నిను, భానుమండలముమధ్యన్ బొల్చు, పద్మాసనా
సీనున్, హార, కిరీట కుండలధరున్, శ్రీరత్నదివ్యాంబర
శ్రేణీ భాసితు, శంఖచక్ర కలితున్, శ్రీవక్షుఁ, గంజాక్షు, నా
కానందంబు నొసంగవే, కరుణ పొంగన్; సత్యనారాయణా! 50

జననంబున్, మరణంబు, సంచితముగా, సంసారదుఃఖాబ్ధి ము
గ్గిన నా, కీ విషయప్రపంచ మెఱఁగాఁగీలించి, వాల్గంటిరూ
పున గాలంబిడి, పట్టి, బంధువలయంబున్ జేర్చి, నీ లీలకున్
వినియోగించెద, వీ భవం బుడుప లేవే? సత్యనారాయణా! 51

భవదాశీర్వచనమ్ము మమ్ము ,సతమున్ బాలింప, భద్రమ్ము లెం
దు, విశేషమ్ముగఁగల్గు, సత్ఫలితముల్ దోరంబులై వెల్గు, స
త్కవి సంసేవిత! యో రమారమణ! త్వత్కారుణ్యభావమ్మునన్
జవసత్వమ్ములుగూర్చి, సాయపడుమీశా! సత్యనారాయణా! 52

చిరకాలంబు, సుఖంబులన్ బడసినన్, జీవుండు భక్తిన్, భవ
చ్చరణంబుల్, భజియింపఁజాలఁడకటా! సర్వంబు స్వార్థంబు, మే
లరయన్ నేరఁడు, భద్రమున్ గనఁడు దుర్వ్యాపారపారీణతన్,
దరిఁజేర్చం, దలపోయవే కరుణ, నాథా! సత్యనారాయణా! 53

'శరణం' బన్న విధానమున్ దలఁప లేశం బేనియున్ లేదు, నీ
చరణంబుల్, మదినమ్మినాఁడ సతమున్, స్వామీ! కటాక్షింపవే,
స్థిర సంకల్పము, సిద్ధియుం గలుగ, నాశీర్వాదమున్ జేసి, కా
తరభావంబుఁదొలంగఁజేయుము, విధాతా! సత్యనారాయణా! 54

సనకాదిప్రముఖార్చితాంఘ్రికమలా! సంవిత్స్వరూపా! సనా
తనధర్మప్రతిపాలకా! సకలమంత్రస్తుత్య! సర్వేశ! స
జ్జన సంరక్షణ, దుష్టశిక్షణ కళాసంపన్న!వేదాంతవే
ద్య!నివేదింతు ననుగ్రహింపు మనవద్యా! సత్యనారాయణా!55

ఓకారుణ్యపయోధి! సత్కరుణ, నన్నోమం గటాక్షింపవే,
చీకుల్ చింతలు మాన్పి ప్రోవుము శుభాశీర్వాద సంపత్తి, న
స్తోక ప్రాభవ!నీమహామహిమమున్‌స్తోత్రంబుఁగావింతు, నీ
కై, కైమోడ్పులొనర్తు, దీనజనరక్షా! సత్యనారాయణా! 56

దరహాసోజ్జ్వలమున్, దయామృతగుణస్థానమ్ము, దివ్యమ్ము, సుం
దర, సుజ్ఞాననిధానమున్, మహిత విద్యాసార సర్వస్వమున్,
పరమార్థప్రతిపాదనక్షమము. నీ భాస్వన్ముఖాంభోజ, మా
దర సౌరభ్య సమాహితమ్ము నగు, వంద్యా! సత్యనారాయణా! 57

కనులారన్ నినుఁజూడఁగల్గిన, శుభాకాంక్షల్ ఫలించున్, జనా
ర్దన! నీ సన్నిధి సౌమనస్యమెసఁగున్, ద్వత్పాద పద్మంబులన్
వినయం బేర్పడఁగొల్చినన్ గలుగు, సద్విద్యాబలప్రాభవం,
బనయం, బాదరబుద్ధిఁబ్రోవుము, వదాన్యా! సత్యనారాయణా! 58

"పరమాత్మా!ననుఁగావవే"యనుచుఁదాఁబ్రార్థించు వెన్వెంటనే
"సిరికింజెప్పక, శంఖచక్రయుగమున్ జేదోయి సంధింప," కా
కరిరాజున్ గరుణించి కాచితివి, నక్రంబున్ విదారించుచున్
సరవిన్, నన్నటుఁబ్రోవరావె, జగదీశా! సత్యనారాయణా! 59

నెపముల్ వెట్టుట నేర మెన్నుటయెకానీ యొక్కనాడైన, ని
క్కపుఁబ్రేమన్ మధురంపుమాటఁబలుకంగాలేఁడు మూర్ఖుండు, పు
ణ్యపుఁగార్యంబొకఁడేనిఁజేయఁదలపోయం డా యహంకారి, లో
కపుమర్యాద గణింపఁబోవఁ, డకలంకా! సత్యనారాయణా! 60

నవ చైతన్య విలాసభాసుర శుభానందైక సాయుజ్య వై
భవ, ముల్లంబున నుల్లసిల్లెడు, మహద్భాగ్యంబు భావింతు, దే
హ విమోహంబెడలించి, సంచిత మహాఘౌఘంబులన్ ద్రెంచి,యీ
భవబంధమ్ములడంచి, కావుమిఁక, దేవా! సత్యనారాయణా! 61

చిర సంప్రార్థిత సౌఖ్య మోక్షణమునన్ సిద్ధించె, సర్వాత్మ, ని
న్వరణీయున్, గనుగొంచు, సద్వ్రతముల న్గావించు భాగ్యంబుఁగూ
ర్చి, రుజా, శోక, విమోహ పాశవితతిన్ ఛేదించి, నిన్‌జేరనౌ
పరమార్థంబిడవే, భవాబ్ధిఁదరియింపన్, సత్యనారాయణా! 62

త్రిగుణాతీతుఁడవై, త్రిమూర్తులకుఁ దత్తేజంబుఁగల్పించుచున్,
జగదాధారుఁడవై, జగన్మయుఁడవై, సర్వంబు శాసించుచున్,
నిగమాంతప్రతిపాద్యమానమహిమన్ నిర్నిద్రభావంబుఁదో
పఁగఁ, జిద్రూపుఁడవై, వెలుంగుదువు; దేవా! సత్యనారాయణా! 63

శ్రుతి శాస్త్ర స్మృతు లభ్యసింప, రచనాసూత్రంబులున్ నేర, నే
గతి మెప్పింపఁగలాఁడ నిన్నుఁగవితన్, గారుణ్యపాథోధి! స
న్నుతిఁగావించుచు, నంతరంగమున సంతోషంబుఁబొంగన్ వచిం
చితి నీకైతఁ, బరిగ్రహింపుము దయన్, శ్రీ సత్యనారాయణా! 64

అనయంబున్, నయమాత్మలందలఁచి, దివ్యప్రాభవోపేతు, ని
న్నానరన్ గొల్చినవారి కున్నత పదం, బుద్యత్కృపన్ గూర్తు, వో
ముని సంభావిత!మంగళాధ్వర సముద్భూత ప్రమోదాంతరం
గ! నివారింపవె దుఃఖముల్, భువనరక్షా! సత్యనారాయణా! 65

నిరహంకార నిరూఢభావరచనానిర్నిద్రతేజస్స్వరూ
ప! రసానందమరంద బంధుర కళాప్రావీణ్య!సంపూర్ణ!త
త్త్వరహస్యప్రతిభా ప్రభావ మెఱుఁగన్ బ్రార్థింతు,ఁబాలింపవే
పరమప్రీతి భజింతు నిన్ సతతము; దేవా!సత్యనారాయణా! 66

సంసారంబున, నెండమావి కెనయౌ, సౌఖ్యం,బపేక్షించి, వి
ద్వాంసుల్ సైతము'నీది, నాద'ను వివాదంబుల్ ప్రధానంబుగా
హింసామార్గమునన్, జరింతు రవురా! యీభ్రాంతి వారించి, నీ
సంసేవా విభవంబు నాకొసఁగు మీశా!సత్యనారాయణా! 67

ధనదాహంబెసఁగన్ దురాశ ఘనసంతాపంబు నింపన్ జగ
జ్జన బాధాకరమై, ప్రమాదభరమై, సర్వంబు నుర్విం, దహిం
చినవేళం, గరుణామృతంబు మిగులన్‌జిందించి, జీవాళి నే
ల, నినున్ వేఁడెద భక్తి, భవ్యగుణశీలా!సత్యనారాయణా! 68

ఆశావాదము జీవనావసర, మత్యాశా ప్రవృత్తింగదా,
క్లేశంబుల్, బహుళంబు భూత తతికిన్, లీలా వినోదంబుఁగా
కీశా!సృష్టి రహస్య మేమిటి? భవం, బే తీరునం దీరు? ని
న్నాశంసింతు, నెఱుంగఁబల్కు, మనవద్యా! సత్యనారాయణా! 69

పలుకన్ బూనిన వేళఁదోడుపడుచున్ వాగ్వైఖరిన్ గూర్చి, మా
టల కర్దంబుల నిచ్చి, చేఁతల కవష్టంభంబుగా నిల్చిభా
సిలు తేజమ్మున, జ్ఞానరూపమయి, సౌశీల్యంబుఁజేకూర్చు, మౌ
దలఁదాల్తున్ భవదంఘ్రిపద్మము లనంతా! సత్యనారాయణా! 70

అరుదై తోఁచు భవత్త్వభావవిభవం, బాఖండలుండాదిగా
సుర సంఘాతము, నిం త్రికాలముల మున్ స్తోత్రంబుగావించు, నో
పరమేశా! పరమార్థి మర్థిజనముల్, భావింపగా నిత్తు, వా
దరమొప్పన్, జగదేకరక్షణసమర్థా! సత్యనారాయణా! 71

తెలియంజాలియుఁదప్పసేయు టకటా! దిక్సూచియుంగల్గి యో
డలు గమ్యంబును జేర కున్నటుల, బాటంగల్గియున్, గంటకం
బులఁబడ్డట్టు, వెలుంగుఁగల్గి విషయంబుల్ జూడలేనట్లె; యీ
చలచిత్తం బెడలింపవే కరుణ నీశా! సత్యనారాయణా! 72

మును, పుట్టించుటకేమి కారణమయా!, పుణ్యంబుఁబాపంబుఁజే
యు, నియోగించెడి వారలెవ్వరొకో? బ్రహ్మాండంబు, సర్వంబు, నీ
వను వాదంబున, నేను నీవనుట సత్యం, బిట్టిచోఁగర్మబం
ధనమెట్లో? వివరింపు మీ క్రమమునంతన్, సత్యనారాయణా! 73

తలఁపన్, జిత్ర విచిత్ర కృత్యముల,నీధాత్రిం, బ్రదర్శింప, జీ
వుల సృష్టించి, పరస్పరం బవసరంబుల్ పెక్కు కల్పించి, వా
రల కాశల్ వెలయించి, పెంచి, తుది, నర్థప్రాణముల్‌ద్రుంచి, బా
ధల పాల్జేయుట, నీకుఁ బండువగుఁగాదా!సత్యనారాయణా! 74

తలనొచ్చెం, బరువాయె, సత్వ ముడిగెన్ ధైర్యంబు శూన్యంబు చం
చలమైయుండె మనంబు, నంబుజదళాక్షా! దుస్సహంబై, యస
త్ఫలదం, బాత్మవివేకబాహ్యము, నహంభావావహంబైన, దీ
యిలసంసార, మసార, మెట్లుడిపెదోయీ!సత్యనారాయణా! 75

కనులన్ గంతలుగట్టి, చక్కికిని పగ్గంబున్ నిబంధించి, త్రి
ప్ప నుపాయంబునఁ దైలకుండు వృషభంబున్; బ్రాణిసంఘంబు, న
ట్లునియోగించి, భ్రమింపఁజేసెదవు, పల్మోహంపు టుర్లన్, బ్రయో
జన మే స్నేహమొ? నేనెఱుంగ, జగదీశా! సత్యనారాయణా! 76

పాపంబుల్ శమియింప, పుణ్యఫలముల్‌ప్రాప్తింపఁగాఁజేయ, నీ
శ్రీపాదంబులుపట్టివేఁడెద, క్షమాశీలుండవై, యజ్ఞునిన్
గాపాడన్ దగుదీవ, భక్తి కవితా కాసార హంసంబవై;
తాపంబుల్ బరిమార్పవే మది, ముకుందా! సత్యనారాయణా! 77

ఉదయం, బస్త మయంబుగా,దినములేదోరీతిఁ బోసాగె, సం
పద లంచున్, వినియోగ మంచుఁ, బరితాపంబంది, బంధంబులన్
గదలన్‌నేరక తల్లడిల్లుచు, విపద్గాఢాంధకారంబునన్
జడియుంబడ్డ, ననున్, గృపన్ మనుపు మీశా!సత్యనారాయణా! 78

దరహాసాంకురచంద్రికల్ నెఱపుచున్, దాక్షిణ్యభావంబునన్
విరబూయించిన, దృక్సుమంబులెలమిన్ బ్రీతిన్ బ్రసాదింప, శ్రీ
కర వాగ్వాహిను, లంతరంగ మెలయన్గాఁజూచి, నన్గాచి, సం
సరణాబ్ధిన్ దరియింపఁజేయవె రమేశా! సత్యనారాయణా! 79

ప్రారంభించిన కార్యమెల్ల, భవదీయాశీఃప్రభావంబునన్,
బారం బొందును, దత్ఫలంబు భవదాప్యంబే, సురశ్రేష్ఠ! యా
ధారంబీవ, సమస్తజీవతతికిన్, ధర్మంబు, మర్మంబు, నీ
వే, రాజీవదళాక్ష! రక్ష నిడ రావే! సత్యనారాయణా! 80

భవదారాధన సేయువారికెపుడున్, భాగ్యంబు సిద్ధంబు, భ
క్తి విశేషంబున, ధ్యాన, ధారణ, సమాధి, జ్ఞాన, వైరాగ్య యో
గ్య విధానంబుల, నిన్నుఁజేరనగు నయ్యా! స్వామి ! త్రైలోక్యమున్
శివమౌ నీయునికిన్, బ్రభావవిభవా !శ్రీసత్యనారాయణా! 81

మధురోహల్ ఫలియించె, సారకవితామందార, మిక్కాల మం,
దధిపా ! నీ కుపహారమిత్తు ననయం బాస్వాదనీయంబుగా,
నిధి, నిక్షేపము లాశఁజేయ, నెపుడేనిన్, జిత్కళారూపమౌ
ప్రథితోద్యోగఫలంబు, నాకొసఁగ రావా! సత్యనారాయణా! 82

మును, తాఁదిన్నది, గోతిపాలగుట, నామోదంబునన్, దాన మి
చ్చిన సొమ్మే, తనదౌట, నిక్క, మరయన్ శ్రీమంతుఁడెవ్వండు, త
ద్ధన, ధాన్యప్రమదాత్మజప్రకరమున్ దా వెంటఁగొంపోయె? మ
జ్జననంబున్ సఫలంబు జేయవె మహేశా! సత్యనారాయణా! 83

శ్రద్ధాసక్తులు కూడఁగట్టుకొని, యోజిన్, భక్తి వశ్యుండవన్
బుద్ధిన్, మూలమెఱింగి, మోక్షపదమున్ బొందించు, నీ దీక్షకున్
సిద్ధంబై, యరిషట్కమున్ దునిమి, వాసిన్, దృష్టి, నీయందు, సం
బద్ధంబున్ బొనరింతు, చేఁదుకొను దేవా! సత్యనారాయణా! 84

అరిషడ్వర్గము లెక్కసేయ, నిహసౌఖ్యాపేక్ష నర్థింపఁ బో
నొరులన్, నెమ్మది నీవుతక్క మఱి వేరొక్కండు లేఁడెన్నడున్
గరపద్మంబులుమోడ్చి, నీపదములన్ గావింతు నే నర్చనం
బు, రమావల్లభ! సావధానత సతంబున్; సత్యనారాయణా! 85

విషవాతావరణంబు కల్పితముఁగావింపన్ సమర్థింప, కి
ల్బిష కృత్యంబుల నాచరింపను, ధనాపేక్షన్ విచారింప, దు
ర్విషయంబుల్ దరిఁజేరనీయ, నొరులన్ జీడింప, సద్భక్తిఁ గ
ల్మషదూరంబుగ, నిన్నె గొల్తుఁ బరమాత్మా! సత్యనారాయణా! 86

గురుదేవుం*డొక కావ్యరూపమున నిన్ గూర్చెన్" మహత్వంబు" ము
న్నరయన్, దానినెపూని, వ్రాయుటయు మర్యాదాక్రమంబౌనె? స
త్కరుణాసాగర! భక్తిమై శతకమున్ గావింతుఁ, గై కొమ్ము, నీ
కరుసంబిచ్చు, యశంబుఁగూర్చు, కవివంద్యా! సత్యనారాయణా! 87

ప్రాణాపాన సమాన వాయువుల నావ్యానం, బుదానంబు స
ప్రాణంబై వెలుఁగున్, జగంబులఁ జలత్స్థాణి ప్రపంచంబు, నా
ప్రాణంబీవ, సమస్త విశ్వమును నీ, వట్లౌటఁ బ్రార్థింతు, బ్ర
హ్మానందానుభవం బొసంగవె మహాత్మా! సత్యనారాయణా! 88

ఎన్నండేనియు, నిన్నుగాక, మఱివేఱెవ్వారినిన్, గొల్వఁబో
నన్నున్, మన్న నఁగావవే, మదినిఁ జింతల్‌బాపి, కారుణ్య! సం
పన్నున్, నిన్ను భజింతు, భక్తిమెయి, నాపన్నప్రసన్నుండ విం
కెన్నాళ్ళీదురవస్థ ? లోమవె; కృపాబ్ధీ ! సత్యనారాయణా! 89

వినుతింతున్, విరచింతు, సంతతశుభాప్తిన్ విశ్వ విఖ్యాతిఁగాం
చిన దివ్య ప్రతిభాప్రభావుని నినున్, శ్రేయోభిలాషుండవై
జననంబాదిగ దుఃఖముల్ దొలఁగు నీసాయుజ్య సంసిద్ధి, ని
మ్మనవద్యా! సురవంద్య! నీకునతులయ్యా! సత్యనారాయణా! 90

* బ్ర.వే.తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రి గారు (చందోలు)

నీపాదోద్భవ యైన గంగ, భువనానీకంబుఁ బూరించుచున్
బాపౌఘంబులు డుల్చి, పుణ్యఫలముల్ పండించి, సద్భక్తులన్
గాపాడున్, విషభోక్తయైన శివుఁడున్ గంగాధరుండౌటఁ ద
త్తాపంబున్ భరియింపఁజాలెడు, మహాత్మా! సత్యనారాయణా! 91

క్షీరాంభోధి జనించులక్ష్మి, భువనక్షేమంకరుండైన, నిన్
జేరన్ వచ్చి, యురస్స్థలంబునఁబ్రశస్తిన్‌నిల్చి, భక్తాళికిన్
గారుణ్యంబున, భోగభాగ్యవితతిన్‌గల్పించి, లోకంబులం
దారాధింపఁబడున్, శ్రితావనగుణాఢ్యా! సత్యనారాయణా! 92

"పరమాణూద్భవమైన చేతనయె, విశ్వంబెల్ల వ్యాపించి, త
త్త్వరహస్యంబును వెల్లడించు" నను, సిద్ధాంతంబు నే నమ్మి, దే
వరఁబూజింపఁగ లోకముల్ దనియవే భావింపఁబూజ్యంబులై,
పరమానందనిధానమౌ పదము నీవా! సత్యనారాయణా! 93

పరమంబై పరమాణువై, ప్రణవతత్త్వంబై, పరబ్రహ్మమై
చరమై,స్థావరమై చరాచరమునై సత్యంబుఁబూర్ణంబునై
సరసంబై, సగుణంబు, సుందరమునై, సాహిత్య సర్వస్వమై
వరలన్ జాలెడు విశ్వరూపుఁడ వనల్పా! సత్యనారాయణా! 94

కనుగొంటిన్ గనుగొంటిఁ దొంటి మునులక్షయ్యవ్రతారూఢు, లే
యనఘున్ గొల్చి, యనుగ్రహంబుఁగని, రయ్యష్టాక్షరీ మంత్రసా
ధన సంతుష్టు, బ్రసన్ను, సన్నుత సురాధ్యక్షున్, సమక్షంబునం
దు, నినున్, దామస సంహరున్, బరమశాంతున్, సత్యనారాయణా!95

స్వామీ!నాపలుకాలకించి, దయతో భావించి, నీపాదసే
వా మాధుర్యము, బంచియిచ్చి, సతమున్ బాలించి, లాలించు, నీ
సామర్థ్యంబు జగంబుమెచ్చుచు"విశిష్టంబైన, దైవ"ంబనం
గా, మమ్మేమమవె, దుఃఖవార్ధిఁగడవంగా, సత్యనారాయణా! 96



నీదాసున్, గరుణించి కావుమని నే నిన్ గోరఁగానేల?మ
ర్యాదాలంకృతి మానవోత్తముఁడవై ప్రాదుర్భవంబంది, నీ
వే, దాక్షిణ్యముతోడఁబల్కవె, "యెవండేనర్థి, నీవాఁడనాన్"
మోదంబిత్తు, వ్రతంబు నాకిది యటన్నన్, సత్యనారాయణా! 97

సత్యమ్మే, మనుదీవ శాశ్వతముగా; సత్యమ్మే యారాధ్యమౌ
సత్యమ్మేయిల సూర్యచంద్రులఁబ్రశస్తంబై ప్రకాశంబిడున్
సత్యమ్మే, యనిలానలమ్ములయి, మహత్త్వమ్ముఁ జేగూర్చెడిన్
సత్యం బబ్ధియు, భూ నభంబులు, పరేశా!సత్యనారాయణా! 98

తపమున్, దానము, యజ్ఞమున్, జపము,తీర్థక్షేత్ర సందర్శనం,
బుపచారంబులు,దైవచింతనయు, సద్యోగంబు సత్యస్థితిన్
విపులంబై, వివిధార్థముల్ దిరముఁ గావింపన్ సమర్థంబులౌ
కపటాత్ముల్ గనలేరు నిక్క మరయంగా, సత్యనారాయణా! 99

భవదాశీర్వచనంబె చాలు, శుభముల్ వర్ధిల్లఁగాఁజేయ; సం
స్తవనీయంబగు నీ సమీక్షణము లేశంబేని, సద్భోగ భా
గ్య విలాసంబులొసంగు, నన్నవరపుంగల్యాణరామా! మహో
త్సవమున్ గూర్చెడు శాంతి, సౌఖ్య మిడు మీశా! సత్యనారాయణా! 100

విజయారోగ్యము లిచ్చి, శత్రుతమమున్‌భేదించి, విఘ్నాళిఁద్రో
చి, జరా, శోకము లాక్రమింపని సుఖశ్రేయంబులంగూర్చు, నీ
రజనాభున్, నినుభక్తివేఁడెద "ననర్థంబుల్ నివారించి, తో
యజనేత్రా!ననుఁగావుమ"ంచు,సురపూజ్యా! సత్యనారాయణా! 101

## సమర్పణ

పదియున్ దొమ్మిది యేండ్లకే, కవిత సంప్రాప్తించె నోదేవ! తీ
ర్చెద మత్పూర్వకృత ప్రతిజ్ఞ, సుగుణ శ్రీఁజేర్చి, మేలేర్చి కూ
ర్చెద నిన్‌గూర్చిన భక్తిమద్రచన, వాసిన్‌మెచ్చి, సర్వార్థసం
పద లీ విచ్చిన పుచ్చుకొందు నవికల్పా! సత్యనారాయణా! 102

చిరకాలమ్ముఁ గటాక్ష వీక్షణ మపేక్షింతున్, గుణగ్రామ, సుం
దరమౌ దివ్య రసార్ద్ర భావకవితానవ్యామృతశ్రీ భవ
చ్చర ణబ్జంబుల ధారవోసెద, సమస్తం, బాత్మభావించి, స
త్కరుణన్ మన్ననసేయుమీకృతి, శుభాంగా! సత్యనారాయణా! 103

వరబృందారక బృందవందిత పదాబ్జా! మౌనిరాట్సేవితా!
పరమస్తుత్యపదప్రభావవిభవా!భక్తేష్ట దాన ప్రియా!
పరిపూర్ణ ప్రకటానురాగభరితా! భాస్వచ్ఛుభాకార! కా
వ్యరమన్, గానుకగాఁగ నిత్తు, గొనుమయ్యా! సత్యనారాయణా! 104

మదినావ్హానముఁ జేసి చేసెద మహోత్మా! పూజ లీవేళ, నీ
కిదె యర్ఘ్యం బ్మిదె పాద్య ,మియ్యదె మురారీ!స్వర్ణసింహాసనం
బిదె, స్నానమ్మిదె, వస్త్రమిద్ది, కలపం బీపుష్ప, మీ పత్ర మి
య్యదె నైవేద్యము, హారతిద్దికొనుమయ్యా! సత్యనారాయణా! 105

అభయంబిమ్ము, శుభమ్ముఁగూర్చుము, జయం బానందమున్ సంఘటిం
చి, భయాందోళన లంతరింపఁగ సుఖశ్రీ లుల్లసిల్లంగఁజే
సి, భవాంభోధిఁ దరించు నావ వగుచున్శ్రేయమ్ము లందిమ్ము, భ
క్తి భజింతున్ నిగమాగమ ప్రణుతకీర్తీ! సత్యనారాయణా! 106

అరయన్ ముక్తికి, దైవభక్తి నిరపాయంబైన మార్గంబుఁగా
వరలన్ జెప్పరె, మున్, జగద్గురువు లా భావంబు, భావించి నీ
చరణంబుల్ మదిఁజేర్చి, యర్చనలు విశ్వాసమ్ముతోఁగూర్చెదన్
గరుణన్బ్రోవుము, కష్టముల్గెడవు మింకన్, సత్యనారాయణా! 107

అపరాధంబు లహర్నిశంబు లొగిఁజేయన్, నన్ను మన్నించి, స
త్కృప రక్షింపవె, నీక్షమాగుణమునన్, దేవాదిదేవా!కవి
త్వపురీతుల్ గణ వృత్త వృత్తు లనుభావంబుల్ గుణాలంకృతా
ది పదార్థంబు లెఱుంగఁ జాల, రసమూర్తీ! సత్యనారాయణా! 108



## శ్రీ సత్యనారాయణ మంగళాశాసనమ్

సత్యావతారరూపాయ మంగళాభరణాంప్రియే ।
పంపాతీర నివాసాయ సత్యదేవాయ మంగళమ్ ॥
స్థిత మన్నవరగ్రామే ప్రియ సత్యవ్రతం ప్రభుం ।
స్మరామి వరదాతారం, సత్యదేవాయ మంగళమ్ ॥
ద్వారే కనక దుర్గాతే, నవదుర్గా గిరిస్థితా ।
రామస్తు వ్రతశాలాయాం, సత్యదేవాయ మంగళమ్ ॥
సత్యనారాయణాయాస్తు సేవ్యమానాయ నిర్జరైః ।
కలి కల్మష నాశాయ సత్యదేవాయ మంగళమ్ ॥
సత్యాయ సత్యరూపాయ సత్యానంద స్వరూపిణే ।
హరి హర స్వరూపాయ సత్యదేవాయ మంగళమ్ ॥
అనంత పద్మనాభాయ మాంగళ్యగుణశాలినే ।
సేవ్యాయానంతలక్ష్మ్యాచ సత్యరూపాయ మంగళమ్ ॥
పద్మనాభ స్వరూపాయ, పర్వతోపరివాసినే ।
సత్యవత్యా సమేతాయ, సత్యరూపాయ మంగళమ్ ॥
సత్యవ్రత స్వరూపాయ, వ్రతాచరణమోదినే ।
నిత్యవ్రత స్వరూపాయ, సత్యరూపాయ మంగళమ్ ॥
అభీష్ట సిద్ధిదాత్రేచ సర్వసద్గుణరూపిణే ।
ఆశ్రితావనదక్షాయ, సత్యరూపాయ మంగళమ్ ॥
శ్రీకృష్ణ శాస్త్రిణా బద్ధ యంత్రమధ్య స్థితాయచ ।
శ్రీకృష్ణవంశపాలాయ సత్యరూపాయ మంగళమ్ ॥

శ్రీశ్రీశ్రీ

మంగళమ్ మహత్